# అథ ద్వాత్రింశోeôధ్యాయః

## సప్తర్షుల రాక

బ్రహ్మోవాచ|

బ్రాహ్మణస్య వచశ్శ్రుత్వా మేనోవాచ హిమాలయమ్ | శోకేనా సాధునయనా హృదయేన విదూయతా || 1

బ్రహ్మఇట్లు పలికెను (1).

బ్రాహ్మణుని మాటలను వినిన మేన శోకముచే ఎర్రబడిన కన్నులు గలదై దుఃఖించు చున్న హృదయముతో హిమవంతుని ఉద్దేశించి ఇట్లు పలికెను (1).

మేనోవాచ|

శృణుశైలేంద్ర మద్వాక్యం పరిణామే శుభావహమ్ | పృచ్ఛ శైవవరాన్ సర్వాన్ కి ముక్తం బ్రాహ్మణ   న హ || 2

నిందానేన కృతా శంభోర్వైష్ణవేన ద్విజన్మనా | శ్రుత్వా తాం మే మనోeôతీవ నిర్విణ్ణం హి నగేశ్వర || 3

తస్మై#్మ రుద్రాయ శైలేశ న దాస్యామి సుతామహమ్ | కురూపశీలినే మే హి సులక్షణయుతాం నిజామ్ || 4

న మన్యసే వచో చేన్మే మరిష్యామి న సంశయః | త్యక్ష్యామి చ గృహం సద్యో భక్షయిష్యామి వా విషమ్ || 5

మేన ఇట్లు పలికెను-

ఓ పర్వతరాజా! పరిణామమునందు సుఖమును కలిగించే నా మాటను వినుము. శివభక్తులనందరినీ అడిగి తెలుసుకొనుము. ఈ బ్రాహ్మణుడు చెప్పినది ఏమి? (2) ఈ వైష్ణవ బ్రాహ్మణుడు శివుని

నిందించినాడు. ఓ పర్వత రాజా! ఆ నిందను విన్న నా మనస్సు మిక్కిలి నిరాశను పొందియున్నది (3). ఓ శైలరాజా! నేను మంచి లక్షణములతో గూడియున్న నా కుమార్తెను చెడు రూపము, శీలము గల ఆ రుద్రునకు ఈయను (4). నీవు నా మాటను విననిచో నేను నిస్సందేహముగా మరణించెదను. వెంటనే ఇంటిని విడిచి పెట్టెదను. లేదా, విషమును మ్రింగెదను (5).

గలే బద్ధ్వాంబికాం రజ్జ్వా యాస్యామి గహనం వనమ్ | మహాంబుధౌ మజ్జయిష్యే తస్మై#్మ దాస్యామి నో సుతామ్ || 6

ఇత్యుక్త్వాశు తథా గత్వా మేనా కోపాలయం శుచా | త్యక్త్వా హారం రుదంతీ సా చకార శయనం భువి || 7

ఏతస్మిన్నంతరే తాత శంభునా సప్త ఏవతే | సంస్మృతా ఋషయస్సద్యో విరహవ్యాకులాత్మనా || 8

ఋషయశ్చైవ తే సర్వే శంభునా సంస్మృతా యదా| తదాeôeôజగ్మ స్స్వయం సద్యఃకల్ప వృక్షా ఇవాపరే || 9

అమ్మాయిని త్రాటితో మెడకు కట్టుకొని దట్టమైన అడవికిపోయెదను. లేదా మహాసముద్రములో ముంచెదను. కాని అమ్మాయిని వానికి ఈయను (6). ఇట్లు పలికి మేన వెంటనే దుఃఖముతో కోప గృహమునకు వెళ్లి ఆభరణములను వీడి ఏడుస్తూ నేలపై పరుండెను (7). ఓ కుమారా! ఇంతలో విరహముచే దుఃఖితమైన మనస్సు గల శంభుడు వెంటనే సప్తర్షులను స్మరించెను (8). శంభుడు స్మరించినంతనే అపర కల్ప వృక్షముల వంటి ఆ ఋషులందరూ మరుక్షణంలో అచటకు స్వయముగా విచ్చేసిరి (9).

అరుంధతీ తథాయాతా సాక్షాత్సిద్ధిరివాపరా | తాన్ దృష్ట్వా సూర్య సంకాశాన్ విజహౌ స్వజపం హరః || 10

స్థిత్వాగ్రే ఋషయశ్శ్రేష్ఠం నత్వా స్తుత్వా శివం మునే | మేనిరే చ తదాత్మానం కృతార్థం తే తపస్వినః || 11

తతతో విస్మయమాపన్నా నమస్కృత్య స్థితాఃపునః |
ప్రోచుఃప్రాంజలయస్తేవై శివం లోక నమస్కృతమ్ || 12

మరియు అపరసిద్ధివలె నున్న అరుంధతి కూడ వచ్చెను. సూర్యునివలె విరాజిల్లుచున్న వారిని చూచి శివుడు తన జపమును ఆపెను (10). ఓ మహర్షీ! తపశ్శాలురగు ఆ ఋషులుశ్రేష్ఠుడగు శివుని యెదుల నిలబడి ఆయనకు నమస్కరించి స్తుతించి కృతార్థులమైతిమని భావించిరి (11). పిమ్మట ఆశ్చర్యచకితులైన ఆ ఋషులు లోకవందితుడగు శివుని మరల నమస్కరించిచేతులు జోడించి ఇట్లు పలికిరి (12).

ఋషయ ఊచుః|

సర్వోత్కృష్టం మహారాజ సార్వభౌమ దివౌకసామ్ | స్వభాగ్యం వర్ణ్యతేeôస్మా భిః కిం పునస్సకలోత్తమమ్ || 13

తపస్తప్తం త్రిధా పూర్వం వేదాధ్యయన ముత్తమమ్ | అగ్నయశ్చ హుతాః పూర్వం తీర్థాని వివిధాని చ || 14

వాఙ్మనః కాయజం కించిత్ పుణ్యం స్మరణ సంభవమ్ | తత్సర్వం సంగతం చాద్య స్మరణాను గ్రహాత్తవ || 15

యోవై భజతి నిత్యం త్వాం కృతకృత్యో భ##వేన్నరః | కిం పుణ్యం వర్ణ్యతే తేషాం యేషాం చ స్మరణం తవ || 16

ఋషులిట్లు పలికిరి-

మహారాజా! దేవతాసార్వభౌమా! సర్వోత్తమమగు మా భాగ్యమును మేము ఏమని వర్ణింపగలము? (13) పూర్వము శరీరవాఙ్మనస్సులచే తపస్సును చేసితిమి. ఉత్తమమగు వేదాధ్యయనమును చేసితిమి. అగ్నిహోత్రమును చేసితిమి. వివిధ తీర్థములను సేవించితిమి (14). శరీరవాఙ్మనస్సులచే సిన పుణ్యము, నిన్ను స్మరంచుటచే కలిగిన పుణ్యము అంతయూ జతగూడి నీవు మమ్ములను స్మరించుట

అను భాగ్యము మాకీ నాడు కలిగినది (15). నిన్ను ప్రతిదినము స్మరించు మానవుడు కృతార్థుడగును. నీచే స్మరింపబడు వారియొక్క పుణ్యమును ఏమని వర్ణించదగును? (16)

సర్వోత్కృష్టా వయం జాతాస్స్మరణాత్తే సదాశివ | మనోరథ పథం నైవ గచ్ఛసి త్వం కథంచన || 17

వామనస్య ఫలం యద్వజ్జన్మాంధస్య దృశౌ యథా | వాచాలత్వం చ మూకస్య రంకస్య నిధిదర్శనమ్ || 18

పంగోర్గిరి వరాక్రాంతిర్వంధ్యాయాః ప్రసవస్తథా | దర్శనం భవతస్తద్వజ్జాతం నో దుర్లభం ప్రభో || 19

అద్య ప్రభృతి లోకేషు మాన్యాః పూజ్యా మునీశ్వరాః | జాతాస్తే దర్శనాదేవ స్వముచ్చైః పదమాశ్రితాః || 20

ఓ సదాశివా! నీవు స్మరించుటచే మేము అందిరిలో గొప్పవారమైతిమి. నిన్ను మనస్సులో స్మరించుట యైననూ మానవులకు దుర్లభము (17). పొట్టివానికి పండు అందినట్లు, పుట్టుగుడ్డికి కళ్లు కనబడినట్లు, మూగివానికి మాటలాడుట వచ్చినట్లు, దరిద్రునకు నిధి లభించినట్లు (18), కుంటివాడు గొప్ప పర్వతమును అతిక్రమించినట్లు, గొడ్రాలికి సంతానము కలిగినట్లు, మాకు దుర్లభమగు నీ దర్శనము కలిగినది. హే ప్రభో! (19) ఈనాటి నుండి మేము లోకములో పూజింపబడెదము. గొప్ప మునులచే మాన్యతను పొందెదము. నీ దర్శనము చేత మాకు ఉన్నత పదము లభించినది (20).

అత్ర కిం బహునోక్తేన సర్వథా మాన్యతాం గతాః | దర్శనాత్తవ దేవేశ సర్వదేవేశ్వరస్య హి || 21

పూర్ణానాం కిం చ కర్తవ్యమస్తి చేత్పరమా కృపా | సదృశం సేవకానాం తు దేయం కార్యం త్వయా శుభమ్ || 22

ఈ విషయములలో పెక్కు మాటలేల? మాకు అన్నివిధములా మాన్యత కలిగినది. దేవతలందరికి ఈశ్వరుడవగు నీ దర్శనముచే పూజ్యత కలిగినది. ఓ దేవదేవా! (21) పూర్ణులకు కర్తవ్యమేమి ఉండును? నీకు దయ ఉన్నచో సేవకులకు ఈయదగిన శుభకార్యమును మాకు అప్పజెప్పుము (22).

బ్రహ్మోవాచ|

ఇత్యేవం వచనం శ్రుత్వా తేషాం శంభుర్మహేశ్వరః | లౌకికాచార మాశ్రిత్య రమ్యం వాక్యముపాదదే || 23

బ్రహ్మ ఇట్లు పలికెను-

మహేశ్వరుడగు శంభుడు వారి ఈ మాటలను విని లోకాచారము ననుసరిస్తూ అందమగు వాక్యము నిట్లు పలికెను (23).

శివ ఉవాచ |

ఋషయశ్చ సదా పూజ్యా భవంతశ్చ విశేషతః | యుష్మాకం కారణాద్విప్రాః స్మరణం చ మయా కృతమ్ || 24

మమావస్థా భవద్భిశ్చ జ్ఞాయతే హ్యుపకారికా | సాధనీయా విశేషేణ లోకానాం సిద్ధిహేతవే || 25

దేవానం దుఃఖముత్పన్నం తారకాత్సు దురాత్మనః | బ్రహ్మణా చ వరో దత్తః కిం కరోమి దురాసదః || 26

మూర్తయోeôష్టౌ చయాః ప్రోక్తా మదీయాః పరమర్షయః | తాస్సర్వా ఉపకారాయ న తు స్వార్థాయ తత్ స్ఫుటమ్ || 27

శివుడిట్లు పలికెను-

ఋషులు సర్వదా పూజనీయులు. మీరు మరిం పూజనీయులు. ఓ విప్రులారా! నేను ఒక కారణముచే మిమ్ములను స్మరించితిని (24). నేను లోకములకు సిద్ధిని కలిగించి ఉపకారమును చేయుటకు నడుము కట్టి యుందునని మీరెంగుదురు (25). దుర్మార్గుడగు తారకుని వలన దేవతలకు దుఃఖము సంప్రాప్తమైనది. బ్రహ్మ అతిక్లిష్టమగు వరము నిచ్చినాడు. నేనేమి చేయుదును? (26) ఓ మహర్షులారా! నా ఎనిమిది మూర్తులు లోక ప్రసిద్ధములై యున్నవి. అవి లోకముల ఉపకారము కొరకే గాని, నా స్వార్థము కొరకు గాదని స్పష్టమే (27).

తథా చ కర్తు కామోeôహం వివాహం శివయా సహ | తయా వై సుతపస్తప్తం దుష్కరం పరమర్షి భిః || 28

తస్యై#్య పరం ఫలం దేయమభీష్టం తద్ధితావహమ్ | ఏతాదృశః పణో మేహిభక్తానంద ప్రదస్స్ఫుటమ్ || 29

పార్వతీ వచనాద్భిక్షురూపో యాతో గిరేర్గృహమ్ | అహం పాలితవాన్ కాలీం యతో లీలా విశారదః || 30

మాం జ్ఞాత్వా తౌ పరం బ్రహ్మ దంపతీ పరభక్తితః | దాతుకామావభూతాం చ స్వసుతాం వేదరీతితః || 31

ఆ కారణముగనే నేను శివాదేవిని వివాహమాడ గోరితిని. ఆమె మహర్షులు కూడ చేయరాని గొప్ప తపస్సును చేసినది (28). ఆమెకు అభీష్టము, హితకరము అగు పరమఫలము నీయవలసి యుండెను. భక్తులకు ఆనందమును కలిగించుట నా ప్రతిజ్ఞయని స్పష్టమే గదా! (29) పార్వతియొక్క మాటను అనుసరించి నేను భిక్షురూపముతో హిమవంతుని గృహమునకు వెళ్లితిని. లీలా పండితుడనగు నేను ఆ కాళి మాటను నిలబెట్టితిని (30). ఆ దంతపులు నన్ను పరబ్రహ్మయని గుర్తించి పరమభక్తితో తమ కుమార్తెను వేదోక్త విధిగా నాకీయ గోరిరి (31).

దేవప్రేరణయాహం వై కృతవానస్మి నిందనమ్ | తదా స్వస్య చ తద్భక్తిం విహంవతుం వైష్ణవాత్మనా || 32

తచ్ఛ్రుత్వా తౌ సునిర్విణ్ణౌ తద్దీనౌ సంబభూవతుః | స్వీకన్ఆయం నేచ్ఛతో దాతుం మహ్యం హి మునయోeôధునా || 33

తస్మాద్భవంతో గచ్ఛంతు హిమాచల గృహం ధ్రువమ్ | తత్ర గత్వా గిరివరం తత్పత్నీం చ ప్రభోదయ || 34

కథనీయం ప్రయత్నేన వచంన వేద సమ్మితమ్ |సర్వథా కరణీయం తద్యథా స్యాత్కార్యముత్తమమ్ || 35

నేను దేవతల ప్రేరణచే శివనిందను చేసితిని. వారి భక్తిని చెడగొట్టుటకై నేను వైష్ణవ రూపమును ధరించి అట్లు చేసితిని (32). వారా నిందను విని మిక్కిలి నిర్వేదమును పొంది భక్తిని గోల్పోయిరి. ఇపుడు వారు నాకు తమ కన్యను ఈయనిచ్ఛగించుటలేదు. ఓ మునులారా! (33) కావున మీరు హిమవంతుని గృహమునకు వెళ్లి ఆ పర్వతరాజునకు, ఆయన భార్యకు హితము నుపదేశించుడు (34). వారికి వేదతుల్యమగు ఉపదేశమును ప్రయత్నపూర్వకముగా చేయుడు. ఈ ఉత్తమ కార్యము తప్పక సఫలమగునట్లు చేయుడు (35).

ఉద్వాహం కర్తు మిచ్ఛామి తత్పుత్ర్యా సహ సత్తమాః | స్వీకృతస్త ద్వివాహెూమే వరో దత్తశ్చ తాదృశ || 36

అత్ర కిం బహునోక్తే న బోధనీయో హిమాలయః | తథా మేనా చ బోద్ధ వ్యా దేవానాం స్యాద్ధితం యథా || 37

భవద్భిః కల్పితో యో వై విధిస్స్యా దధికస్తతః | భవతాం చైవ కార్యం తు భవంతః కార్యభాగినః || 38

ఓ మహర్షులారా! వారి పుత్రికను నేను వివాహమాడ గోరుచున్నాను. ఈ వివాహము నాకంగీకారమే. బ్రహ్మ అట్టి వరమును ఇచ్చి యున్నాడు (36). ఈ విషములో అధిక ప్రసంగముతో బని యేమి గలదు? మీరు మేనా హిమవంతులకు బోధించి దేవతలకు హితమును చేగూర్చుడు (37). మీచే కల్పించబడిన కన్యావరణ విధికంటె అధికమగు వరణమును చేసినట్లగును. ఇది మీ కార్యమే గనుక, దీనిని సిద్ధిపంజేయుటలో మీ భాగము ఉండవలెను (38).

బ్రహ్మోవాచ|

ఇత్యేవం వచనం శ్రుత్వా మనయస్తేeôమలాశయాః | ఆనందం లేభిరే సర్వే ప్రభుణానుగ్రహీకృతా ః || 39

వయం ధన్యా అభూవంశ్చ కృతకృత్యాశ్చ సర్వథా | వంద్యా జాతాశ్చ సర్వేషా ంపూజనీయా విశేషతః || 40

బ్రహ్మణా విష్ణునా యో వై వంద్యస్సర్వార్థ సాధకః | సోeôస్మాన్ ప్రేషయతే ప్రేష్యాన్ కార్యే లోకసుఖావహే || 41

అయం వై జగతాం స్వామీ పితా సా జననీ మతా | అయం యుక్తశ్చ సంబంధో వర్ధతాం చంద్రవత్సదా || 42

బ్రహ్మ ఇట్లు పలికెను-

పవిత్రమగు హృదయము గలవారు, ప్రభుని అనుగ్రహమును పొందినవారు అగు ఆ మునులందరు ఈ మాటలను విని ఆనందమును పొందిరి (39). మేము ధన్యులము, అన్ని విధములా కృతకృత్యులము అయినాము. మేము అందరికీ ప్రత్యేకించి వందనీయులము, పూజింపదగినవారము అయినాము (40). బ్రహ్మవిష్ణువులచే నమస్కరింపబడువాడు, సర్వకార్యములను సిద్ధింప జేయువాడు అగు శివుడు, లోకములకు సుఖమును కలుగజేయు కార్యమునకు పంపదగినవారము మేము అని తలంచి

మమ్ములను పంపుచున్నాడు (41). ఈ శివుడు లోకములకు ప్రభువు, తండ్రి. ఆమె తల్లి. ఈ యోగ్యమగు సంబంధము శుక్లపక్షచంద్రుని వలె దినదిన ప్రవర్ధమానమగు గాక! (42)

బ్రహ్మోవాచ|

ఇత్యుక్త్వా హ్యృషయో దివ్యా నమస్కృత్య శివం తదా | గతా ఆకాశమార్గేణ యత్రాస్తి హిమవత్పురమ్ || 43

దృష్ట్వా తాం చ పురీం దివ్యామృషయస్తేeôతివిస్మితాః | వర్ణయంతశ్చ స్వం పుణ్య మబ్రువన్వై పరస్పరమ్ || 44

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఆ దేవర్షులు అపుడు శివునకు నమస్కరించి ఆకాశమార్గముచే హిమవంతుని రాజధానికి వెళ్లిరి (43). ఆ ఋషులు ఆ దివ్య నగరమును చూచి మిక్కలి ఆశ్చర్యమును పొంది వారిలో వారు తమ భాగ్యమును ఇట్లు వర్ణించిరి (44).

ఋషయ ఊచుః |

పుణ్యవంతో వయం ధన్యా దృష్ట్వై తద్ధిమవత్పురమ్ | యస్మాదేవం విధే కార్యే శివేనైవ నియోజితాః || 45

అలకాయాశ్చ స్వర్గా చ్చ భోగవత్యా స్తథా పునః | విశేషేణామరావత్యా దృశ్యతే పురముత్తమమ్ || 46

సుగృహాణి సురమ్యాణి స్ఫటికైర్వివిధైర్వరైః మణిభిర్వా విచిత్రాణి రచితాన్యంగణాని చ || 47

సూర్య కాంతాశ్చ మణయశ్చంద్ర కాంతాస్తథైవ చ | గృహే విచిత్రాశ్చ వృక్షా స్స్వర్గసముద్భవాః || 48

ఋషులిట్లు పలికిరి -

మనము ఈ హిమవంతుని రాజధానిని దర్శించుట, శివుడు స్వయముగా ఇట్టి కార్యమునందు మనలను నియోగించుట మన పుణ్యము. మనము ధన్యులము (45). ఈ నగరము అలకానగరము కంటె, స్వరగము కంటె, భోగవతీ నగరము కంటె, మరియు అమరావతి కంటె ఉత్తమమైనదిగా కన్పట్టుచున్నది (46). గృహములు అందముగ నున్నవి. వాకిళ్లు వివిధములగు శ్రేష్ఠ స్ఫటికములతో, మరియు మణులతో పొదుగబడి రంగులనీను చున్నవి (47). ప్రతిగృహమునందు సూర్యకాంతమణులు, చంద్రకాంతమణులు, మరియు స్వర్గమునందు పెరిగే విచిత్రములగు వృక్షములు గలవు (48).

తోరణానాం తథా లక్ష్మీర్దృశ్యతే చ గృహే గృహే | వివిధాని విచిత్రాణి శుకహంసై ర్విమానకైః || 49

వితానాని విచిత్రాణి చైలవత్తోరణై స్సహ | జలాశయాన్యనేకాని దీర్ఘికా వివిధాస్స్థితాః || 50

ఉద్యానాని విచిత్రాణి ప్రసూనైః పూజితాన్యథ | నరాశ్చ దేవతాస్సర్వే స్త్రియశ్చా ప్సరసస్తథా || 51

కర్మ భూమౌ యాజ్ఞికాశ్చ పౌరాణాస్స్వర్గకామ్యయా | కుర్వంతి తే వృథా సర్వే విహాయ హిమవత్పురమ్ || 52

ప్రతిగృహమునందు తోరణములు శోభిల్లుచుండెను. గృహములు చిలుకలతో, హంసలతో, విమానములతో చిత్ర విచిత్రములగు రంగులతో విరాజిల్లెను (49). రంగు రంగుల వస్త్రముల తోరణములతో గూడి వితానములు (బాల్కనీలు) ప్రకాశించెను. అనేక జలాశయములు, వివిధములగు దిగుడుబావులు గలవు (50). ఉద్యానములు రంగురంగుల పుష్పములతో ప్రకాశించెను. అచటి పురుషులందరు దేవతలు. స్త్రీలందరు అప్సరసలు (51).

కర్మభూమియందు యాజ్ఞికులు, పౌరాణికులు హిమవంతుని రాజధానిని వీడి స్వర్గము కొరకై వ్యర్థముగా యజ్ఞాదుల ననుష్ఠించుచున్నారు (52).

యావన్న దృష్టమేతచ్చ తావత్స్వర్గపరా నరాః | దృష్టమేతద్యదా విప్రాః కిం స్వర్గేణ ప్రయోజనమ్ || 53

ఇది కంటబడనంత వరకు మాత్రమే మానవులు స్వరగ్గమును కోరెదరు. ఓ విప్రులారా! దీనిని చూచిన తరువాత స్వర్గముతో ప్రయోజనమేమున్నది? (53)

బ్రహ్మోవాచ|

ఇత్యేవ మృషి వర్యాస్తే వర్ణయంతః పురం చయత్ | గతా హైమాలయం సర్వే గృహం సర్వ సమృద్ధిమత్ || 54

తాన్ దృష్ట్వా సూర్యసంకాశాన్ హిమవాన్ విస్మితోeô్బ్రవీత్ | దూరాదాకాశమార్గస్థాన్ మునీన్ సప్త సుతేజసః || 55

బ్రహ్మ ఇట్లు పలికెను -

ఆ ఋషిశ్రేష్ఠులు ఆ నగరమునిట్లు వర్ణిస్తూ సర్వసంపదలతో విలసిల్లే హిమవంతుని గృహమునకు వారందరు వెళ్లిరి (54). దూరములో ఆకాశమునందు గొప్ప తేజస్సుతో సూర్యుని వలె వెలుగొందే ఆ ఏడ్గురు మునులను చూచి చకితుడైన హిమవంతుడిట్లనెను (55).

హిమవానువాచ|

సప్తై#్తతే సూర్యసంకాశా స్సమాయాంతి మదంతికే | పూజా కార్యా ప్రయత్నేన మునీనాం చ మయాధునా || 56

వయం ధన్యా గృహస్థాశ్చ సర్వేషాం సుఖదాయినః | యేషాం గృహే సమాయాంతి మహాత్మానో యదీదృశాః || 57

హిమవంతుడిట్లు పలికెను -

సూర్యుని వలె వెలుగొందు ఈ ఏడ్గురు నా వద్దకు వచ్చుచున్నారు. నేనీ మహర్షులకు ఇప్పుడ శ్రద్ధగా పూజను చేయవలెను (56). ఇట్టి మహాత్ములు ఎవరి ఇంటికి విచ్చేయుదురో, అట్టి గృహస్థులగు మనము ధన్యులము. వీరు అందరికీ సుఖమునిచ్చెదరు (57).

బ్రహ్మోవాచ|

ఏతస్మిన్నంతరే చైవాకాశాదేత్య భువి స్థితాన్ | సమ్ముఖే హిమవాన్ దృష్ట్వా య¸° మానపురస్సరమ్ || 58

కృతాంజలిర్నతస్కంధస్సప్తర్షీన్ సుప్రణమ్య సః | పూజాం చకార తేషాం వై బహుమాన పురస్సరమ్ || 59

హితాస్సప్తర్షయస్తే చ హిమవంతం నగేశ్వరమ్ | గృహీత్వోచుః ప్రసన్నాస్యా వచనం మంగలాలయమ్ || 60

యథాగ్రతశ్చ తాన్ కృత్వా ధన్యో మమ గృహాశ్రమః | ఇత్యుక్త్వా సన మానీయ దదౌ భక్తి పురస్సరమ్ || 61

బ్రహ్మ ఇట్లు పలికెను -

ఇంతలోనే ఆకాశమునుండి భూమిపైకి దిగి ఎదురుగా నిలబడిన ఆ ఋషులను చూచి హిమవంతుడు సన్మాన పూర్వకముగా ఎదురేగెను (58). చేతులు జోడించి తలను వంచి ఆయన సప్తర్షులకు నమస్కరించి వారికి బహుమాన పూర్వకముగా పూజను చేసెను (59). హితమును చేయు ఆ సప్తర్షులు పర్వతరాజగు హిమవంతుని పట్టుకొని ప్రసన్నమగు ముఖముగలవారై మంగళములకు నిలయములగు వచనములను పలికిరి (60). వారిని ముందిడుకొని హిమవంతుడు 'నా గృహస్థాశ్రమము ధన్యమైనది' అని పలికి వారికి భక్తి పురస్సరముగా ఆసనమును సమర్పించెను (61).

ఆసనేషూపవిష్టేషు తదాజ్ఞప్త స్స్వయం స్థితః | ఉవాచ హిమవాంస్తత్ర మునీన్ జ్యోతిర్మయాం స్తదా || 62

తేజో మూర్తులగు ఆ మునులు ఆసనములందు కూర్చున్న వారై ఆజ్ఞాపించగా, హిమవంతుడు తాను నిలబడియున్నవాడై ఇట్లు పలికెను (62).

హిమాలయ ఉవాచ |

ధన్యో హి కృతకృత్యోహం సఫలం జీవితం మమ | లోకేషు దర్శనీయోeôహం బహుతీర్థసమోమతః || 63

యస్మాద్భవంతో మద్గేహమాగతా విష్ణు రూపిణః | పూర్ణానాం భవతాం కార్యం కృపణానాం కార్యం గృహేషు కిమ్ || 64

తథాపి కించిత్కార్యం చ సదృశం సేవకస్యమే | కథనీయం సుదయయా సఫలం స్యాజ్జనుర్మమ || 65

ఇతి శ్రీ శివ మహాపురాణ రుద్ర సంహితాయాం పార్వతీ ఖండే సప్తర్ష్యా గమన వర్ణనం నామ ద్వాత్రింశోeôధ్యాయః (32).

హిమవంతుడిట్లు పలికెను-

నేను ధన్యుడను. కృతకృత్యుడను. నా జీవితము సఫలమైనది. ప్రజలు నన్ను అనేక తీర్థములతో సమానముగా భావించి దర్శించెదరు (63). ఏలయనగా, విష్ణుస్వరూపులగు మీరు నా గృహమునకు విచ్చేసితిరి. పూర్ణులగు మీకు దీనులగు గృహస్థుల గృహములలో కార్యము ఏమి ఉండును? (64) అయిననూ, దయచేసి సేవకుడునగు నాకు తగిన ఏదో ఒక పనిని చెప్పుడు. నా జన్మ సఫలము కాగలదు (65).

శ్రీ శివ మహాపురాణములోని రుద్రసంహితయందు సప్తర్షుల రాకను వర్ణించే ముప్పది రెండవ అధ్యాయము ముగిసినది (32).